# క ర్త కా దు

ర చ యి త:

శ్రీ కొవ్వలి



ప్ర కా శ కు లు:

పసుపులేటి బాపిరాజు,

శ్రీ సత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,

రా జ మ ం డ్రి.

1946

Paper Supplied by Party Q. H. E. G. 34.

 [వెల రు. 0—8—0,



# సూచన

చేతులారా చేసుకొన్న ప్రతిపనివల్లాకలిగే ఫలితాన్ని "కర్మ" అని సరిపెట్టుకోవడం హిందూసాంప్రదాయ మయింది.

బుద్ధిపూర్వకంగా తాము చేసుకోవడ మేమిటి, అనివార్యమయిన కర్మసిద్ధాంతాన్ని దానికి ముడిపెట్టడ మేమిటి?

మానవులాచరించే కార్యాకార్యాల ననుసరించి ఫలితాఫలితాలు కలుగుతుంటాయన్న జ్ఞానం కలిగి నప్పుడుగాని, జీవితంలోని ఒడుదుడుకులు సర్దుకోవు—

ఇట్లు,
రచయిత.



శ్రీరామప్రెస్, రాజమండ్రి.

౧

జోరుగాపరుగెత్తివస్తున్న మోటారుకారు కడ్డంగా నిలుచుండా బిక్షుకురాలు—

దారిలేక కారునాపుజేశాడు డ్రైవరు.

'ఒక్కడబ్బియ్యావ్! ఒక్కరూపాయియ్యవ్.' అంటూ ఆ యాచకురాలు కారులోవున్న నరేశం ముఖంమీదికి చెయ్యిచాస్తూ అడిగింది.

ఏమిటా ధైర్యం! ఏమిటీ ఆమెసాహసం!

నరేశంపేరుచెబుతే ఆజిల్లాలోని పక్షులు నీళ్ళుతాగవు—ప్రజలకు సింహస్వప్నం! అటువంటి సందర్భంలో ఒకచింకిగుడ్డలబికారిది—యాచకురాలు, కలక్టరుగారి కారును నడిరోడ్డుమీద ఆపుజేసి, బిక్ష మడగడమా?

దారిపోయేజనమందరూ కొయ్యబారి, ఎక్కడివారక్కడే నిలుచుండిపోయి, ఆదృశ్యాన్ని విడ్డూరంగా చూస్తున్నారు.

ఆముష్టిదిచేసిన సాహసానికీ—దాని మోటతనానికీ — కలక్టరుగారామెకు శిరచ్ఛేదమే చేయిస్తారో — జన్మాంతర ఖయిదునే విధిస్తారో—, అని అక్కడ మూగినప్రజలందరూ శరీరాల్లో ప్రాణాలులేకుండా కళ్ళువొదిలిపెట్టి చూస్తూన్నారు.

బిక్షకరాలు కంటికక్కనుపించగానే నరేశం తన రెండుచేతుల తోనూ ముఖమును కప్పుకున్నాడు—

'ఒక్కడబ్బియ్యావ్? ఒక్కరూపాయియ్యావ్?'

అని బిక్షకురాలు తిరిగి చేతిని కారులోకి చాచింది. అధికారులు తనపై యెక్కడ ఆగ్రహంచేస్తారో అని—డ్రైవరు కారును స్టార్టుచేశాడు.

'ఆగు డ్రైవర్! ఆగు!'

అంటూ నటేశం, ఆయాచకురాలనుంచి తనముఖము నింకో వయిపుకు తిప్పుకుని, జేబులోనుంచి గుప్పెడునోట్లు రూపాయలూతీసి ఆమెదోసిట్లోపోసి, వెంటనే—

'పో—పో—'

అంటూ, అతడు చేతులతో తలనుమోదుకున్నాడు—కారు ముందుకు సాగిపోయింది. బిక్షుకరాలు వికటంగా నవ్వుతూ, దోసిట్లోని రూపాయలనూ నోట్లనూ గిలకరించుకొంటూ వెళ్ళిపోయింది.

'కలక్టరుగారి కేమయినా మతిపోయిందా? పిచ్చిపట్టిందా! నడి రోడ్డుమీద కారాపుజేసిన ముష్టిముండను పళ్ళు రాలగొట్టకపోగా చేతికొచ్చినన్నినోట్లు—రూపాయలూతీసి, దానిదోసిట్లో పొయ్యడమా? ఇదేంచిత్రం—ఇదెక్కడి విడ్డూరం—'

అని వింతగా చెప్పుకొంటూ అనంతర మక్కడమూగిన జన మందరూ ఎవరిమట్టుకువారు వెళ్ళిపోయారు.

కారులోపోయి, యిల్లు చేరుకున్నాడన్నమాటేగాని; నటేశాని కానాడంతా మనసువికలమై పోయింది. అతడుతల్లితోగాని, కొడుకుతో గాని ఖులాసాగా లేడు.

నిత్యమూ ఆఫీసునుంచి రాగానే, స్నానంచేసి, కొడుకునుముస్తాబు చేసి, కారుమీద, ఊరువెలుపలి తోటలోకి షికారు తీసుకుపోవడం మామూలు. ఆనాడటువంటి దేమీ లేకుండా, వచ్చీరావడంతోనే దుస్తులయినా మార్చుకోకుండా మేడమీదికిపోయి, ఒంటరిగా ఒక వాలుకుర్చీలో కూచుని, విషాదము ననుభవించడం మొదలుపెట్టాడు.

గోపీచందు కప్పుడు పద్ధాలుగోయేడు. స్కూలుఫయినలు కొక్క క్లాసు తక్కువలో చదువుతున్నాడు.

స్కూలునుంచి వచ్చీరావడంతోనే, బామ్మ, పరిచారకుల సాయంతో మనవడికి నీళ్లుపోసి దుస్తులువేసి, తండ్రిగారొచ్చే వేళకు సిద్ధంగా వుంచుతుంది.

అనాడుకూడా మామూలు అలవాటుప్రకారం చందు షికా రుకుసిద్ధమై తండ్రిగారి రాకను గుర్తించకపోవడంవల్ల బామ్మ దగ్గర కెళ్ళి—

'ఏమే బామ్మా! నాన్నగారింకా రాలేదా? నాకు షికారు కాలశ్యమై పోవడంలేదూ?'

అని అడిగాడు.

"నాన్నగారొచ్చారు బాబా! చాలాసేపయింది—మేడమీద ఏ జరుగురు కాగితాలయినా చూసుకుంటున్నారేమో—పోయిచూడు!'

అని బామ్మ చెప్పిచెప్పడంతోనే చందు పరుగుపరుగున తండ్రి గారున్న మేడమీదికి పోయాడు.

తండ్రిగారు ఖిన్నులై వాలుకుర్చీలో కూర్చుని వుండడమును తిలకించాడు— ఒడిలో కురికి—

'నేనప్పుడే రెడీఅయ్యాను—మీరింకా షికారుకు లేవరేం నాన్నగారూ?' అని అడిగాడు.

అన్యమనస్కుడైయున్న నరేశం, కొడుక్కు వెంటనే జవాబు చెప్పలేక, అతని క్రాపింగు తనచేతులలో నిమురుతూ—

'ఏంబాబా! ఏమంటావ్!'

అని అడిగాడు.

'షికారుకు—లేవాలి—'

'ఓ! షికారుకా! నాకీపూట ఒంట్లో కులాసాగాలేదు—డ్రైవరు తీసుకుపోతాడు—ఈవేళకు నువ్వు వెళ్లునాన్నా!'

అని తండ్రిచెప్పడంతోనే ముఖమును ముడుచుకున్నాడు చందు తక్షణం తండ్రిగారి ఒడిలోనుంచి ఉరికి, మేడదిగి వచ్చేశాడు బామ్మ దగ్గరకు వెళ్ళి—

'బామ్మోయ్! బామ్మా! నాన్నగారుషికారుకురానంటున్నారే!'

అని ముఖమును చిన్నబుచ్చుకుని చెప్పడంతోనే—

'అదేంనాయనా! నాన్నగారెందుకు రానన్నారూ?'

అని బామ్మ ఆశ్చర్యంగా అడిగింది.

'ఖులాసాగా లేదుట—నాన్నగారికీ వేళ—'

'అదేం? ఒంట్లో బాగాలేదా? కనుక్కుందాంరా—'

అని చెప్పి ఆమె మనమడిని వెంటబెట్టుకొని మేడమీద కొడుకున్న దగ్గర కెళ్ళింది.

'ఏం బాబూ! ఒంట్లో ఖులాసాగా లేదన్నావుటేం?'

'ఏమీ లేదమ్మా! ఖులాసాగానేవుంది.'

'మరయితే కుర్రాణ్ణి షికారుకు తీసుకెళ్ళనన్నావుటేం?'

"నాకీవేళ షికారుపోవాలని లేదు—డ్రైవరు తీసుకుపోతాడు లే—"

అంటూ అతడు శిరస్సును చేతులతో పట్టుకొని, ఏదో ఆవేదన ననుభవిస్తుండడంవల్ల—

'తలనొప్పిగావుందా?'

అని తల్లి కొడుకు శిరస్సును తాకుతూ వాత్సల్యంతో అడిగింది.

'అబ్బే! ఏమీ లేదమ్మా! మీరు కిందికిపోయి పనిచూసుకోండి.'

అని నరేశం అనగా—

'రా నువ్వు కూడా.'

అని చందు తండ్రిగారి చెయ్యిపట్టుకొని లాగడం మొదలు పెట్టాడు.

'ఇస్! అల్లరి చెయ్యకు బాబూ! కిందికి వెళ్ళు—'

అని నరేశం అన్నమాటలోని విసుగుదలను తల్లి గమనించింది. చందు కూడా గమనించాడు.

'రా బాబూ! మనం కిందికిపోదాం. నిన్ను డ్రైవరు తీసుకుపోతాడు లే షికారు—కారుమీద.'

అని బామ్మ మనమణ్ణి చెయ్యిపట్టుకొని తీసుకుపోతుంటే—

'నేనూ వెళ్ళనీ వేళ షికారుకు—'

అంటూ చందు బొమ్మతో మేడదిగి కిందికివెళ్ళిపోయాడు.

కొడుకు అవిధంగా స్వస్థతచెడివున్నకారణమును తెలుసుకోలేక తల్లి ఇంతీదేవిమనస్సు అధికంగా వ్యాకులపడడం మొదలుపెట్టింది.

'అబ్బాయికీవేళ ఎందుచేతనో ఖులాసాగాలేదు. కచ్చేరీలోని రాచకార్యాలవల్ల అలావున్నాడా? అబ్బే! ఎటువంటి తొందరవ్యవహారాలొచ్చినప్పటికీ, అబ్బాయెవరిమీదనూ చిరాకుపడడు. అటువంటి దీనాడు యిలావున్నా డెందుచేతనో?'

ఎటువంటి హోదాలోవున్నా, ఎంతడబ్బు సంపాదించుకొన్నా, ముఖ్యమయినది మనశ్శాంతి, అది లేకపోయినాక ఎన్ని వున్నప్పటికీ ఒకటే—

ఏంలోటు? కలక్టరీ హోదాలో బ్రహ్మాండంగా వెలిగిపోతున్నాడు. నెలకు రెండువేల రూపాయిలజీతం—జీవితము నెంతఆనందంగా గడుపుకోవాలీ!

తిరిగి వివాహాం చేసుకోమంటే వినడు. గట్టిగాచెబుతే చిరాకుపడతాడు, నేనేం చెయ్యను! వాడు ఖులాసాగా వున్నాడంటే చూసి సంతోషించ వలసినదాన్ని—లేకపోతే విచారించవలసినదాన్ని.'

అని ఇంతీదేవి కొంతసేపు తనలోతాను విషాదమునుపొంది, అనంతరం మనసుండబట్టక, తిరిగి కొడుకున్న మేడమీదికి వెళ్ళింది. అతనికి చేరువలో కూర్చుంది. కొంతసేపటివరకూ నరేశం తల్లిని పలకరించలేదు. అనంతరం—

"ఏం అమ్మా?"

అని అడిగాడు.

'అబ్బే! ఏమీలేదు—వూరికేనేవచ్చా."

"చందు షికారుకెళ్ళాడా?"

"లేదు—సావిట్లో ఆడుకుంటున్నాడు."

'డ్రైవరున్నా తీసుకుని వెళ్ళమన్నాగా?'

'వెళ్ళనన్నాడు.'

తరువాత మరో అయిదు నిమిషాలు మౌనంగా వూరుకున్నాడు నరేశం.

'వివాహవిషయ మేమాలోచించా వబ్బాయీ?'

అని ఇంతీదేవి మెల్లిగా అడిగింది. నరేశం జవాబు చెప్పలేదు.

'ముప్పయ్యేళ్ళు నిండాయంతేగదా! అనేకమంది బ్రతిమాలుతున్నారు. నీకునచ్చిన పిల్లని—''

"అమ్మా! ఆవిషయంచెప్పకే! ఒకేసారి నిశ్చయంచేసుకున్నాను''

"పెద్దదాన్ని చెబుతున్నాను.''

"ఈవిషయంలో లాభంలేదు.''

అంటూ నరేశం అక్కడనుంచిలేచి కిందికివచ్చేశాడు. కొడుకుతో, కేరంసు బోర్డుదగ్గర కూర్చుని ఆడడం మొదలుపెట్టాడు. అంతవరకూ ఒంటరిగా ఆడుకొంటున్న చందు, తనతో తండ్రిగారు కూడా ఆడవచ్చినందుకు అపరిమితమయిన సంతోషమును పొందాడు.

---

## ౨

చందు ఏడుస్తూ, ఖంగారుతో పరుగెత్తుకొచ్చి, బామ్మను కౌగలించేటప్పటి కామె మరింతబేజారై, మనమడి వీపుమీదతట్టి—

'ఎందుకుబాబూ! ఎందుకూ? జడుసుకున్నావా?'

అని అడిగింది.

'ఆపిచ్చిదెవరో నన్ను తరుముకొచ్చిందే బామ్మా!'

అని, చందు వెనక్కితిరిగి చూస్తూ మరింత గట్టిగా యేడవడం మొదలుపెట్టాడు. ఇంతీదేవికేమీ అర్థమయిందికాదు.

'పిచ్చిదా! తరుము కొచ్చిందా?'

అంటూ ఆమె ఖంగారులో వాకిట్లోకెళ్ళి చూసింది. కాని ఆమె కెవరూ కనుపించలేదు

'ఎవరూ లేరుబాబా!'

'తరుముకొచ్చిందే నన్ను పట్టుకోడానికి! నేను పరుగెత్తుకొచ్చాను.'

'ఎప్పుడూ?'

'ఇప్పుడే! నేను స్కూలునుంచి వస్తుంటే, దారిలో పట్టుకోబోయింది, నాకు చాలా భయమేసింది.'

'భయంలేదు—ఊరుకో!'

'నౌఖర్ను పంపించి, ఆపిచ్చిదెవరో కనుక్కోమంటాను.'

అని, ఇంతీదేవి, వెంటనే నౌఖరు వీరాయినిపిలిచి—

'ఒరేయ్! వీరాయి! అలా వాకిట్లో కెళ్ళిచూడు! ఎవరోపిచ్చిదిట! అబ్బాయిగార్ని తరుముకొచ్చిందట! అదెవరో పట్టుకొని చావగొట్టిరా!'

అని చెబుతుండగా—

'ఆపిచ్చిదాన్ని మనయింటికి తీసుకురావద్దని చెప్పవేబామ్మా.'

అన్నాడు చందు బెదురుచూపులతో.

'తీసుకురాదులేబాబా! నేనుండగా నీకెందుకూ అంతభయం.'

అని ఆమె మనమడికి ధైర్యం చెప్పింది. మరికొంతసేపటికి వీరాయి తిరిగివచ్చి—

'నాలుగువీధులూ తిరిగి చూచానమ్మా, పిచ్చిదెవరూ కనుపించలేదు.'

అని చెప్పిన మీదట—

'గుడ్డివెధవ! వీరాయి కేమీ కనుపించదు—ఒంకిరిజుట్టు, పెద్ద కళ్ళు—గల పిచ్చిది నీకెక్కడా కనుపించలేదుట్రా?'

అని వీరాయి నడిగాడు చందు.

'కనుపించలేదం డబ్బాయిగారూ! కనుపిస్తే వొదిలిపెడతానా? జుట్టుపట్టుకొని నాలుగు తన్ననూ?'

అని వీరాయి తిరిగి అన్నాడు.

'ఈసారి కనుపించినప్పుడయినా అలాచెయ్యి లేకపోతే ఆపిచ్చిది మళ్ళీనన్ను పట్టుకోడానికి పరుగెత్తు కొస్తుంది.'

అని చందు అన్నాడు.

'అలాగేబాబూ! ఇంతటినుంచీ నువ్వు బడికిఒంటరిగా పోవద్దు. వీరాయిని కూడాతీసుకుపో!'

అంది ఇంతీదేవి.

'ఆడపిల్లలాగ, వీరాయిని వెంటబెట్టుకునిపోనాబడికి!'

అని చందు విరగబడినవ్వడం మొదలుపెట్టాడు.

'నౌఖర్ను వెంటబెట్టుకుని, వెళ్ళినంతమాత్రాన, ఆడపిల్ల వైపోతావాబాబా నువ్వు?'

అని ఇంతీదేవి మనమడి మాటలకు నవ్వుకుంది.

'కాదాయేమిటి బామ్మా! మొగపిల్లలేమయినా చేస్తారని— ఆడపిల్లలందరూ నౌఖర్లను వెంటబెట్టుకుని పోతారుబడికి.'

'ఆడపిల్లలేమీ చెయ్యకుండా నువ్వూ ఓనౌఖర్ను వెంటబెట్టుకెళ్ళు.'

'నేనలానెళ్ళను. రేపటినుంచీ, కారుమీదపోయి, కారుమీద వస్తాను.'

'అలాగేచెయ్యి బాబూ! నీకోసం ప్రత్యేకము ఒకకారును కొనమనిచెప్తా మీనాన్నగారితో—'

అని ఇంతీదేవి చెప్పిన అనంతరం చందు వేరేపనిమీద అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

ఇంతీదేవికి నటేశమొక్కడే కొడుకు. ఆమెభర్త సబ్‌జడ్జీచేసి, పింఛను పుచ్చుకొన్నతరువాతకూడా మరికొంతకాలం జీవించాడు.

ఆయన బ్రతికి వున్నప్పుడు తనకొడుకును లండను పంపించి, ఐ. సి. యస్. చదవించాలని భార్యతో చెబుతుండేవాడు.

కాని నటేశం బి. ఎ చదువుతుండగానే అతనితండ్రి చనిపోయాడు, తండ్రిగారు బ్రతికివున్నప్పుడు చెప్పడమే గాకుండా, నటేశానికూడా ఐ సి యస్. చదవాలని వుండేది.

భర్త జీవించివుండగా తీర్చుకోలేని కోరికను తాను నెరవేర్చాలని యింతీదేవి కొడుకును అనంతరం లండనుకు పంపించింది. తండ్రిగారు సంపాదించినద్రవ్యం చాలినంత వుందిగాబట్టి, నటేశం లండనుపోయి, నిర్ణయించబడిన కాలమంతా అక్కడవుండి పరీక్ష ప్యాసయి వచ్చాడు.

వచ్చి రావడంతోనే అతనిని గుంటూరుజిల్లాకు కలక్టరుగా నిర్ణయించారు. అక్కడ ఆరుమాసాలు మాత్రంచేసి, అనంతరం ఆర్కాట్ జిల్లాకు బదిలీ చెయ్యబడ్డాడు. అక్కడనుంచి తిరిగి గుంటూరు—ప్రస్తుతం కృష్ణాజిల్లా కలక్టరుగా వుంటున్నాడు అయిదారు మాసాలనుంచీని.

కొడుకును ఐ. సి. యస్. ప్యాసుచేయించి భర్తగారికోరికను నెరవేర్చగలిగినందుకు ఇంతీదేవి అపరిమితమయిన ఆనందము ననుభవిస్తూవుంటుంది. నటేశం అతిఘనంగా కలక్టరీఉద్యోగమును చేస్తుంటే ఆమె కన్నులపండువుగా తిలకిస్తూవుంటుంది.

గుమ్మంలో కారాగినచప్పుడు కావడంవల్ల కొడుకుకచ్చేరీనుంచి వచ్చాడని తెలుసుకొన్నఇంతీదేవి, టీవగైరాలను సిద్ధంచేయవలసినదిగా వంటమనిషిని హెచ్చరించి తాను నటేశంకోసం అటూఇటూ తిరుగుతూంది.

ఇంతలో చందు గబగబా లోపలికొచ్చి—

'బామ్మా! బామ్మోయ్! నాన్నగారాపిచ్చిదానికి రూపాయలు, నోట్లు అన్నీ యిచ్చేస్తున్నారు—'

అని చెప్పాడు. ఇంతీదేవి అపరిమితమయిన ఆశ్చర్యంతో కచ్చేరీ సావిడితలుపుచాటున నిలిచి, వీధిలోకిచూచింది.

అప్పుడే కారుదిగిన సరేశం—అక్కడ చేతులుచాచుకుని నిలుచున్న బిచ్చగాలిదోసిట్లో తనచేతికొచ్చినన్నిరూపాయలనూ నోట్లనూ తీసిపోస్తున్నాడు. వెంటనే తనముఖము నింకోవయిపుకు తిప్పుకుని, చరచరలోపలికొచ్చి మేడమీది కెళ్ళిపోయాడు.

ఇంతీదేవి ఆబిచ్చుకరాలినిచూచి ఒకనిట్టూర్పునువిడిచి వంటయింట్లోకెళ్ళిపోయింది.'

'బామ్మా! ఆపిచ్చిదే నన్నుపట్టుకోడానికి పరుగెత్తుకొచ్చిందీ?'

అని చందు చెప్పినమాటలు వినిపించుకోకుండా ఏమేమో ఆలోచిస్తూంది.

దోసిట్లోరూపాయలుపడగానే ఆబిచ్చుకరాలు పిచ్చిపిచ్చిగా పాడుకొంటూ అక్కడనుంచి పరుగెత్తిపోయింది.

'నాన్నగారెందుకు — ఆపిచ్చిదానికన్నిరూపాయలు, నోట్లూ యిచ్చేస్తున్నారుబామ్మా!'

అని చందు తిరిగి అడిగాడు.

'మనకెందుకులేబాబూ! ఊరుకో! అటువంటిప్రశ్న లడుగుతే నాన్నగారు కోపంచేస్తారు.'

'నన్నుముట్టుకోడానికి తరుముకొచ్చినదానికి మనం డబ్బియడ మెందుకూ?'

ఇంతీదేవి జవాబుచెప్పలేదు.

'అలా అలవాటుచేస్తే అదిలోపలికూడా వచ్చేస్తుందేమోనే బామ్మా!'

ఇంతి దేవి జవాబు చెప్పలేదు.

'నేను చెబుతానుండు—నాన్నగారితో—'

అంటూ చందు చరచర మేడమీదికి పరుగెత్తాడు. ఇంతి దేవి కూడా మెల్లిగా అతని వెనకాలనే వెళ్ళింది.

'ఏమండీ నాన్నగారూ! ఆపిచ్చిదానికలా నోట్లూ, రూపాయలూ యెందుకిచ్చేస్తున్నారూ! అదినన్ను పట్టుకోడానికి తరుముకొచ్చిందం!!'

అని కొడుకు అడిగినదానికి నరేశం ఒక వేడినిట్టూర్పును విడిచి—

'పట్టుకోడానికి—తరుముకొచ్చిందా బాబా! హుఁ! తరుముకొస్తుంది.

అంటూ నరేశం, కొడుకుని కౌగలించి, హృదయానికి అదుము కొంటూ చెప్పలేని హృదయ వేదనను దేనినో అనుభవించడం మొదలు పెట్టాడు.

కొంచం యివతలగా నిలుచుని ఇంతి దేవి ఆవిషయమునంతటినీ గమనిస్తూనేవుంది.

'ఆపిచ్చిది నన్నుపట్టుకోడానికి పరుగెత్తుకొచ్చిందినాన్నగారూ! దానికి మనం రూపాయలు, డబ్బులూ ఎందుకు ఈయడం?'

అని చందు అడిగినదానికి నరేశం కళ్లుమూసుకుని ముఖము నింకోవయిపుకు తిప్పుకొని—

'ఊఁ! అలాగే బాబా! కిందికిపోయి ఆడుకో—'

అనడంతోనే, అతనికి చిరాకుగావుందన్న విషయమును తెలుసుకొని ఇంతీదేవి—

'చందూ! కిందికిరా బాబూ! నీళ్లుపోస్తాను.'

అని పిలిచి, మనమణ్ణి కిందికితీసుకుపోయింది.

నరేశాని కెందుకో కళ్ళనీళ్లు జలజలరాలాయి. హృదయంలో ఏదో మంట—భరించలేని ఆవేదన—

ఏమీతోచక మేడమీదనే పిచ్చివాడిలాగ అటూయిటూ పచార్లుచేయడం మొదలుపెట్టాడు.

దూరాన ఎక్కడో పిచ్చివానిపాట వినిపించడంవల్ల గబగబ పోయి కిటికీతలుపులను మూసేసుకున్నాడు.

---

## 3

సందేశం ఆఒక్క బిచ్చకురాలికే డబ్బియ్యడము—ఆబిచ్చకురాలు ఒక్క సందేశమునుతప్ప, ఇంకేవనీ చెయ్యిచాచి అడగకపోవడము—చాలా మందికి ఆశ్చర్యంగానేవుంది.

సందేశము నడగడానికెవరికీ ధైర్యంలేదు. బిచ్చకురాలి నడిగినా అదిచెప్పదు—ఆమె ఒకఉన్మాదిని అని అందరకూ తెలుసు.

కలక్టరుగారిచ్చిన డబ్బును పట్టుకుపోయి, ఆబిచ్చకురాలు ఏం చేస్తూందా అని, కొందరు పరిశీలనగా చూచారు.

మొగవాళ్ళకంటే యెక్కువ చొరవగా ఏహోటల్లోకి పడితే ఆహోటల్లోకి చొరుచుకుపోతుంది. ఎప్పుడుపడితే అప్పుడు—తనకేమి కావాలంటే అదితిని చక్కావస్తుంటుంది.

అందుకుమించి ఆడబ్బు నామె వేరుమార్గంలో దుర్వినియోగం చెయ్యడం లేదు.

కలక్టరుగారా బిచ్చకురాలికి రూపాయలు నోట్లు యిస్తుండడము యితర బిచ్చకులు కొందరుచూచారు. ఆమేడదగ్గర గుంపులు గుంపులుగా మూగడం మొదలుపెట్టారు. కాని కలక్టరుగారు వారికేమీ ఈయకపోగా నౌఖర్లచేత అదలింపించి, వెళ్ళగొట్టిస్తారు.

దానం సహజగుణమయితే, కలక్టరు గారందరీ బిచ్చగాళ్ళకూ తృణమో—ఫణమో ఈయాలిగాని—ఆఒక్క బిచ్చకురాలికే, అడిగినప్పుడల్లా, గుప్పిళ్ళతోను—దోసిళ్ళతోనూ రూపాయిలు విరజిమ్మడ

మేమిటాఅని, అనేకమంది ఆ గాలుతీయడం మొదలుపెట్టారు. కాని యెవరికీ అంతు దొరకలేదు.

ఆబిచ్చకురాలికయినా, యిచ్చినది సంతోషంతో ఈయరు. ఆమె ముఖమునయినా చూడడాని కిష్టపడక, అసహ్యించుకుంటూ—ఆమె మీద రూపాయిలు విసిరేస్తారు—పొమ్మని—ముఖము నింకోవయిపుకు తిప్పుకుని అసహ్యంగా చెబుతారు.

తండ్రిగారి భావమేమిటో స్వంతకొడుకయిన చందుకే తెలియడంలేదు. అతను అడిగినా, వారు ముఖమును చిట్లించుకుని—

'ఆవిషయమంతా నీకనవసరం—ఆవతలకుపో—' అంటారు.

ఇహ ఇంతీదేవి కొడుకునావిషయమడగనూ లేదు — అతనిచేత అదలించబడనూలేదు.

ఇంతీదేవికి, రమారమీ అరవైయేళ్ళు దాటాయి, వృద్ధాప్యం లోనేవుంది. మనమడి వివాహకార్యమునుకూడా కళ్ళారాచూచినిర్విచారంగాచనిపోవాలని, ఆమెనేచివుంది.

కొడుక్కు వివాహయోగ్యమయినవయస్సు రాకపోయి నప్పటికీ తల్లిగారికోరికను తీర్చడానికీ, చందుకు వివాహప్రయత్నంచేస్తూనే వున్నాడుకలక్టరుగారు.

'కాని, ఆకార్యమింకా యెప్పటికవుతుందో'అని, ఇంతీదేవికి ఆదుర్దాగావుంది.

ఒకనాడతను స్థిమితంగా కూర్చున్నసమయమున కనిపెట్టి, ఇంతీదేవి, కొడుకుదగ్గరచేరి—

'నాయనా! ఏవేళనో—ఏమూలనో ఆవలించేరోజు. లివినాకు. అబ్బాయిపెళ్ళికూడా కళ్ళతోచూచుకుని చచ్చిపోవాలని వుందిరా!''

అని ప్రారంభించింది

'చందుబాబుకు పెళ్ళైనా? అలాగేచేద్దాంలేఅమ్మా— అందుకు చచ్చిపోవడాలెందుకూ?'—

'అదికాదురా! నేను పెద్దదానినయ్యాను. వాడిపెళ్ళి నాకళ్ళ ముందు అవుతుందో కాదో అని అలా అంటున్నాను.'

'అవసరంలేదమ్మా! నీకటువంటి బెంగ యేమీ అవసరంలేదు. మనం చేసుకుంటామూ అంటే, అనేకమంది సిద్ధంగావున్నారు. కాని వాడికింకా యుక్తవయస్సురాలేదేమో అని నేను ఆలోచిస్తున్నాను. నీకోరిక నెరవేర్చడమునే కర్తవ్యంగా పెట్టుకున్నాను. నాలుగయిదు సంబంధాలు, మనబంధుకోటిలోవాళ్ళే సిద్ధంగావున్నారు. ఏదోఒకటి ఖాయంచేసి వచ్చేనెలలో చందుకు వివాహం చేసేద్దామమ్మా!'

'చాలాసంతోషం నాయినా! పదిపదకొండేళ్ళపిల్లఅయితేచాలు.'

'మునసబుగారమ్మాయికి సరిగా అంతేవయస్సు. చాలా అందమయిన పిల్లకూడా—మనం అడగకముందే పదివేలు గుమ్మరించడానికి సిద్ధంగావున్నాడాయన.'

'బాగుందినాయనా! అయితే ఆసంబంధమునే ఖాయంచెయ్యి—'

అని ఇంతీదేవి చెబుతున్నసమయంలో చందక్కడికొచ్చి—

'మికాయపోదాంరండినాన్నగారూ! డ్రైవరుకారురెడీచేసి చాలాసేపయింది' అన్నాడు.

'పోదాంగానీ—నీకెటువంటిపెళ్ళాంకావాలో చెప్పుబాబూ!'

'పెళ్ళాం.'

'ఆఁ! బామ్మ నీకు త్వరగా పెళ్లిచేసెయ్యమంటుంది.'

'నేనప్పుడే పెళ్ళిచేసుకోనండినాన్నగారూ! లండనుపోయి ఐ. సి. యస్. ప్యాసయివచ్చాక—అప్పుడుపెళ్లి—'

అని చందుఅనగా—

'పెళ్లిచేసుకుంటేమాత్రం చదువుకోకూడదా యేమిటా భడవగా!'

అని యింతీదేవి మనమణ్ణి మందలించింది.

'నాకొద్దు—నేనప్పుడే పెళ్ళి చేసుకోను' అన్నాడు చందు.

'తప్పుబాబా! బామ్మ చెప్పినమాటలు వినాలి – అలా యెదిరించ కూడదు.'

అని తండ్రిగారన్నమీదట చందు తిరుగుజవాబు చెప్పలేదు.

'నేను నీకుబామ్మనుకాదునాయనామరీ! పెద్దకాలము వచ్చేసిందా మరీ! నేను బ్రతికివుండగానే, నీకు పెళ్ళయితే కన్నులపండుగుగాచూచి ఆనందిస్తాను. నేను చచ్చిపోయాక, నీపెళ్ళిచూస్తానాచెప్పు.'

అని ఇంతీదేవి అంటుండగా—

'కుర్రాడిదగ్గర అటువంటిమాట లెందుకేలమ్మా! నువ్వుచెప్పిందాన్నెవరయినా కాదన్నారా? వచ్చేనెలలో నీయిష్టప్రకారంగానే అబ్బాయికి వివాహం చేసేదామన్నాగా!'

అని నటేశానికి మనసు కష్టంతోచి అన్నాడు.

'అవును నాయనా! అన్నావు. వచ్చేనెలలోనే చిట్టిబాబు పెళ్ళికి ఏర్పాట్లు చేస్తానన్నావు—'

"ఈముసలమ్మల కెప్పుడూ యివేమాటలు—'

అంటూ చందు అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

'అయితే అబ్బాయీ! అదితిరిగి యీవూరొచ్చిందాయేమిట్రా?'

అని యింతీదేవి అడగ్గా—నటేశం ఆమెముఖంలోకి తీక్షణంగా చూచాడు.

"దానిసిగురించి గుంటూరుజిల్లానుంచి యీజిల్లాకు బదలీచేయించుకున్నాడు. శనిగ్రహంలాగున తిరిగి యిక్కడ దాపురించింది.'

'అబ్బా! పోనియ్యవేలమ్మా! దానిమాట యెత్తకు.'

'చందు కావిషయమంతా తెలుస్తే వాడిమనస్సుకెంత కించ కలుగుతుంది? కుటుంబాని కంతటికీ అగౌరవమవునా? దానిమూలంగా యిప్పుడుమళ్ళీ యేవూరు బదిలీ చేయించుకుంటావూ?'

'ఇస్స్! అసంభాషణ మానెయ్యమన్నానా?'

'నాకెందుకు లేదండ్రీ! అనకనక, ఎప్పుడయినాఅంటే యిలాగే విసుక్కుంటావు. బంగారంలాటి సంసారజీవితం దగ్ధపటలమయింది.'

అని ఇంతిదేవి, యింకా అదేప్రకారం అతని కిష్టంలేని సంభాషణ చేయడంవల్ల, నరేశం కళ్ళెర్రజేశాడు.

'ఇక్కడనుంచి లేచిపొమ్మన్నావా? ఆసంభాషణను మానేస్తావా?'

అని తీవ్రంగా అడిగాడు.

'మానేశాగా!'

పదినిమిషాలవరకూ తల్లి ఏమీ మాటలాటలేదు—కొడుకూ ఏమీ మాటలాడలేదు. ఇరువురూ మౌనంగా వూరుకున్నారు.

'అబ్బాయికి మునసబుగారి సంబంధమును ఖాయం చేయమన్నావా!'

'చెయ్యి—అదే చాలాబావుంటుంది—నువ్వు ఊఁ! అనడమే ఆలశ్యంగానీ—అన్నిప్రయత్నాలూ నిమిషంలో అయిపోతాయి, నువ్వు కుర్చీమీదకాలును కిందికి దించవలసిన అవసరంలేదు.'

'సరే—వచ్చేనెలలో ముహూర్తమును నిశ్చయం చేయిస్తాను.'

అని, తనకోరిక ప్రకారం చందుకు వివాహం చేయడానికి కొడుకంగీకరించాడుగదా, అని ఆముసలిప్రాణి అపరిమితమయిన ఆనందమును పొందింది.



కలెక్టరుగారింట్లో వివాహానికి అవసరమయిన ప్రయత్నాలన్నీ అతిబ్రహ్మాండంగా చేయబడ్డాయి.

పోలీసుశాఖ, రివిన్యూశాఖ—మ్యునిసిపల్ శాఖలకు చెందినఉద్యోగస్థులందరూవచ్చి చేతులుకట్టుకు నిలుచున్నప్పు, డావివాహకార్యానికి లోటేముంటుంది?

అందులోనూ జిల్లామునసబుగారితో వియ్యం. వియ్యంకు లిరువురూ సమానహోదాలోనివారు. వేడుకలు, విందులు అతివైభవంగా జరుపబడుతున్నాయి. వీధులనిండా పెళ్ళిపందిళ్లు, ఎక్కడెక్కడలేని మేళాలు, తాళాలు—పాటకచ్చేరీలు—

దేవేంద్రవైభవంతో ఒకవయిపున వివాహం జరుగుతుంటే, అనేకవందలమంది ఆ వివాహంలో పాల్గొంటూ హడావిడిగావున్న సమయంలో ఆపిచ్చిదానిగొడవ యెవరికిగావాలీ?

అందరిలోనూ తానూ ఒకమనిషిలాగ ఆచ్చిది సంతోషంలో కేరింతాలు కొట్టడం—నాట్యంచేస్తూ వెర్రి వెర్రిపాటలేమో పాడడం! ఆమెవయిపు చూచినవాళ్ళు చూస్తూన్నారు—లేనివాళ్లు లేదు —కొందరదలించి పొమ్మంటున్నారు.

మనుమడి వివాహసందర్భంలో ఇంతీదేవి కందరకంటే యెక్కువ హడావిడిగావుంది. ఆమె అంత హడావిడిలోనూ ఆపిచ్చిదానిని చూచింది. పోలీసులు, ఇతరఉద్యోగులు, ఆమెను బెదిరించి వెళ్ళగొడుతుండడము—ఆమె, వారెంత అదలించి వెళ్ళిపొమ్మన్నప్పటికీ, తరిమికొట్టినప్పటికీ మళ్ళీమళ్ళీ పెళ్ళిపందిరిలో కొస్తుండడమూ—ఇంతీదేవి గమనించింది.

త్వరత్వరగా కొడుకున్నదగ్గరకువెళ్ళి,

'అది వచ్చిందిరోయ్! పందిట్లోకి రానియ్యకుండా అందరూ దానిని అదలించి వెళ్ళగొడుతున్నారు.''

అని చెప్పింది.

'ఎవరమ్మా?'

''అదేరా!''

అని తల్లి చెప్పగా మీదట, నటేశం ఒకనిట్టూర్పును విడిచి—

'అమ్మా! దానికి కడుపునిండా యింత అన్నం పెట్టించి పంపవే! దానిని కొట్టొద్దనీ, అదలించి వెళ్ళగొట్టొద్దనీ అందరితోనూ చెప్పు— రాత యెవరు తప్పిస్తారూ?'

అని కొడుకు చెప్పినప్రకారం చెయ్యడానికి ఇంతీదేవి వెళ్ళిపోయింది.

పరిచారకులూ పిచ్చిదానిని పందిట్లో నిలవకుండా తరిమికొడుతున్నారు.

'పాపం! దానినెవరూ ఏమీఅనకండర్రా! కడుపునిండా అన్నం తిని పోతుంది—అదిఎవరినీ ఏమీచెయ్యదు.'

అని ఇంతీదేవిచెప్పిన అనంతరం, ఆపిచ్చిదానిజోలికెవరూ పోలేదు.

ఇంతీదేవి వంటవాళ్లతో చెప్పి ఆఉన్మాదికి విస్తరివేయించి, తానుదగ్గరవుండి వడ్డనచేయించి, పిచ్చిదానికి భోజనంపెట్టించింది. భోజనానంతరమయినా పిచ్చిదివెళ్ళిపోలేదు.

'పెళ్లికొడుకునుచూస్తా—పెళ్లి కూతుర్నిచూస్తా—'

అంటూ ఆపందిరిలోనేఅటూయిటూ తిరగడంమొదలుపెట్టింది.

మేడమీదినుంచి నటేశం ఆమెచర్యలనన్నింటినీ కనిపెడుతున్నాడు. తనలోతానెందుకో మితిలేనిబాధ ననుభవించడంమొదలుపెట్టాడు.

ఆనాటివివాహకార్యక్రమమంతా సక్రమంగా జరిగిపోయింది. నటేశమెందుచేతనో ఏ వేడుకలోనూ పాల్గొనడంలేదు. మేడమీద తన గదిలో యెందుకో ఖిన్నుడై వుంటున్నాడు.

ఇంతలో అతనిమనస్సుకు ఏమనితోచిందోఏమో—గబగబ మేడ దిగివచ్చి పెళ్లిపందిరిలో సంతోషంగా కేరింతాలు కొడుతున్న పిచ్చి దానినిచూచి—

'దానిని దూరంగా తరిమెయ్యండి—పందిట్లోకి రానీయొద్దు.'

అని ఆజ్ఞాపించడమే తడవుగా అక్కడవున్న పరిచారకులు కర్రలతోను, కంచీలతోనూ ఆపిచ్చిదానిని తరిమికొట్టారు.

నటేశంతిరిగి మేడమీదికివెళ్ళిపోయి, తనగదిలోని పందిరిమంచంమీద పడుకుని వెక్కి వెక్కి యేడవడం మొదలుపెట్టాడు. ఎందుకో ఏమో యెవరికి తెలుసు?

తనస్థితి నితరులు గమనించకుండా తలుపులు లోపలగడియపెట్టుకున్నాడు.

ఇంతిదేవి ఏదోపనిమీద కొడుకుకోసమొచ్చి కిటికీలోనుంచి చూచింది.

'అబ్బాయీ! తలుపుతియ్యి—పనివుంది—'

అని తల్లిగారు పిలవడంతోనే, నటేశంకళ్ళనీళ్ళు తుడుచుకొని తలుపులుతీశాడు. అతనిముఖంలోని విషాదరేఖలను తల్లిగుర్తించక పోలేదు. ఎంతతుడుచుకున్నప్పటికీ అతనికళ్లంట నీటిబిందువులింకా రాలుతూనేవున్నాయి.

'అదేమిట్రానాయనా! ఇటువంటి శుభసమయంలో, సర్వజనులూ ఆనందాట్టహాసాలలో మునిగితేలుతున్న సమయంలో నువ్విలా కంటతడిపెట్టుకుంటావా! ఎందుకో—నాకు తెలుసు—'

అని తల్లిగారనేటప్పటికి—అతనిలోని దుఃఖమంతా మరొక్కసారి పొంగిపొర్లి ప్రవహించింది. నటేశం చంటికుర్రాడిలాగ తల్లిని కౌగలించి బేరుమన్నాడు.

ఐ. సి. యస్. ప్యాసయినవాడు, కలక్టరీ ఉద్యోగము సద్వితీయంగా సాగిస్తున్నవాడు—అలా దుఃఖపడుతూంటే ఇంతీదేవి ఏమని ఓదార్చగలను?

'తప్పుతండ్రీ! సర్వజ్ఞుడవయిన నువ్వే యిటువంటి పనిచేస్తుంటే నేనేం చెప్పగలను? ఇందులో నీతప్పేముంది? దానికే ఋణం లేకపోయింది. స్వర్గసౌఖ్యాలను కాలదన్నుకుని పోయింది—అందుకు నువ్వేం చేస్తావు? ఊరుకో—"

అని ఇంతీదేవి కొడుకు ననేకవిదాల ఓదారుస్తున్న సమయంలో ఒకరిద్దరా మేడమీాదికి రావడంవల్ల, నరేశం ముఖము నింకోవయిపుకు తిప్పేసుకుని—

'వెళ్ళిపోఅమ్మా! నువ్వు నాదగ్గరనుంచి వెళ్ళిపో—"

అని, తల్లిని చేతులతో తోసెయ్యడంవల్ల ఆమె అక్కడనుంచి వెళ్ళిపోయింది. కాని కొడుకు విచారంవల్ల ఆమె మనసుకూడా వికలమై పోయింది.

'అబ్బాయి విచారిస్తున్న కారణం ఎవరికయినా తెలిసిందంటే, కుటుంబాని కెంతఅగౌరవం! చందుయొక్క భావిజీవితం ధ్వంసమై పోవడమేగాకుండా వాడిమనస్సెంత ఖేదపడుతుంది? ఆ లేతహృదయం వికలమయిందీఅంటే, యిహా ఎవరుచేసేదీ ఏమీాలేదు.

వాడితల్లి ఏనాడో మరణించిందనే లోకమనుకుంటూంది. ఆ భావమే కొనవరకూ సాగుతేనేతప్ప, లేకపోయినట్లయితే, యింతకాలం నుంచీ కాపాడుకొంటూ వస్తున్న వంశగౌరవమంతా మంటగలిసి పోతుంది—'

అని, అనంతరమూ ఆమె తనలో తానసేకవిధాల కుమిలికుమిలి యేడ్చింది; కాని తన విషాదభావాను నితరులెవరూ గమనించకుండా కాపాడుకో గలిగింది.

## ౫

విందులు—పాటకచ్చేరీలు ముగిసేటప్పటికి రాత్రి రెండుగంటలు దాటింది. అప్పటికే అలసిఅలసివున్నారేమో — పెళ్ళివారిలో చాలా మంది అంతకుముందే పడుకుని నిద్రపోయారు.

వేడుకలన్నీఅయినాక, పాటకచ్చేరీలు ముగిసినతరువాత — ఆపందిట్లోనే మిగిలిన పెళ్లివారెక్కడివారక్కడ పడుకొని నిద్ర పోయారు.

అనంతరంకూడా మరికొంతసేపు ఇంతీదేవికొడుకుతో ఏమేమో కబుర్లుచెబుతూ మేలుకొనేవుంది. ఆతరువాత ఆమెకూడా పడుకుని కునుకుతీసింది. నటేశానికిమాత్రం యెందుచేతనో నిద్రపట్టిందికాదు. అతడు ఓపెద్ద వరండాలో చాలాసేపు అటూఇటూ పచార్లుచేసి అనంతరమక్కడ ఒక వాలుకుర్చీవుంటే అతనుకూడా అందులోకూలబడ్డాడు. క్రమంగా అతనికికూడా కునుకుపట్టింది.

చందు పాటకచ్చేరీసగం జరుగుతుండగానే పోయి తండ్రిగారి గదిలో వారుమామూలుగా పడుకొనే పందిరిమంచంమీద పడుకొని నిద్రపోయాడు. కుర్రప్రాణంగదా!

భజంత్రీలు, ఉద్యోగులు, పరిచారకులు — వంటవాళ్లు — ఎవరి మట్టుకువారెక్కడో ఒకచోట పడుకుని—సుఖనిద్రలోవున్నారు. పెళ్లి పందిళ్లలోను—భవనంలోను, అంతటా వెలుగుతున్న విద్యుద్దీపాలు అర్ధరాత్రినిసయితం పట్టపగలుకంటే, యెక్కువ ప్రకాశవంతంగా చేస్తున్నాయి.

అంతవరకూ ఆచుట్టుపక్కలనే తిరుగుతున్నపిచ్చిది—క్రమంగా భవనంలో ప్రవేశించింది. అందరూ గాఢనిద్రాముద్రితులై యుండడం వల్ల ఆమెను వారించగలవారెవరూ లేకపోయారు.

ఆమె భవనంలోని నాలుగుగదులూతిరిగి క్రమంగా చందుపడు కొని నిద్దరపోతున్నగదిలోకొచ్చింది. ఆమె ఆపుకోలేని ఆనందంలో ఆ బాలకుడిమీదపడి ముద్దులుపెట్టుకోవడం మొదలుపెట్టింది.

చందు నిద్దట్లో త్రుళ్ళిపడి లేచాడు. తనమీదపడి ముద్దులు పెట్టుకొంటున్న పిచ్చిదానినిచూచి భయవిభ్రాంతు డయినాడు—

"బామ్మోఁ! బామ్మోఁ! పిచ్చిది మళ్ళీవొచ్చిందేవ్!"

అని ఒక్కవెర్రికేక వేసి తండ్రిగారి రివాల్వరుంటే పరుపుకింద తడిమాడు. దానినందుకున్నాడు.

"నాచిట్టితండ్రి పెళ్ళికొడుకయితే చూడాలనివచ్చా నంతేగాని, నేనేంజేశానూ?"

అంటూ, రివాల్వరును చూడగానే ఆపిచ్చిది ప్రాణభయంవల్ల రెండడుగులు వెనక్కువేసి, పారిపోవాలని చూచింది. కాని చందు ఆమెను పారిపోనీయకుండా రివాల్వరును పేల్చాడు మొదటిగురి తప్పి పోయినా ఊరుకోలేదు రెండోసారి పేల్చాడు—పిచ్చిదానికా దెబ్బ తగిలింది. హా! అంటూ గుండుదెబ్బతగిలి ఆగుమ్మంలో పడిపోయింది.

"బామ్మా! బామ్మా! నాన్నగారూ! నాన్నగారూ!"

అని చందు ఖంగారుతో కేకలెయ్యడం మొదలుపెట్టాడు.

రెండుసార్లు రివాల్వరు చప్పుడు వినగానే మేలుకొన్నాడు నటేశం గబగబ మేడదిగి వచ్చేలోపుగా సర్వనాశనం! చందు పెట్టిన కేకలతో ఇంతీదేవి, మిగిలిన పెళ్ళివారు, అందరూ మేలుకొని నటేశంతోపాటు చందు గదిదగ్గరకు పరుగులెత్తుకొచ్చారు.

గుమ్మందగ్గరపడివున్న పిచ్చిదాని కళేబరమును చూడగానే నటేశం తొట్రుపడ్డాడు—ఇంతీదేవి విభ్రాంతురాలయింది.

"ఈపిచ్చిది నాగదిలోకొచ్చి—నామీదపడిందినాన్నా! అందుకని కాల్చాను."

అని చందు ఒణుకుతున్న గొంతుకతో చెప్పాడు.

వటేశం తలను నేలకేసి కొట్టుకొంటూ—

'ఇసీ! పాపాత్ముడా! మాతృహంతకుడా—'.

అని సణుకున్నాడు, కాని అతనిమాట ఎవరికీ వినిపించలేదు.

'పిచ్చిది తెలియక గదిలోకొస్తే, కుర్రాడు బెదిరి, రివాల్వరుతో కాల్చినట్లున్నాడు—ఆమె యింకా బ్రతికివున్నట్లుంది— త్వరగా డాక్టర్ను పిలిపించండి—'

అని ఇంతిదేవి యింటిగుట్టు బయటపడకుండా అంది.

ఆమె ఆజ్ఞప్రకారం, కొందరుడాక్టర్లకోసం కార్లమీద బయలు దేరారు.

అర్ధరాత్రి అయితేనేం, అపరాత్రి అయితేనేం? కలక్టరుగారి యింట్లోజరిగిన ప్రమాదం. అందువల్ల డాక్టర్లు రెక్కలు కట్టుకుని వాలారు.

గొడవలేకుండా వుండడంకోసం, అందరూ బయటికి వెళ్ళగొట్టబడ్డారు. ఇంతిదేవి, కొడుకును, మనమణ్ణి మేడమీదికి తీసుకు పోయింది.

'అయ్యో! బిడ్డా చందూ! మీయమ్మ—చేతులారా—'

అని ఇకచెప్పలేక, వటేశం కొడుకును కౌగలించి వలవల యేడవడం మొదలుపెట్టాడు.

'మాఅమ్మ—'

అంటూ చందు మరింత తెల్లబోయాడు.

'పిచ్చిది మాఅమ్మా?'

అని విభ్రాంతుడై చూడడం మొదలు పెట్టాడు.

'గొడవచెయ్యకు నాయనా! నెమ్మదిమీద నీకంతా చెబుతాను- ఇది నలుగురూ వినదగిన విషయంగాదు.'

అని ఇంతీదేవి, మనమడి నోరునొక్కింది.

'ఆపిచ్చిది మాఅమ్మేనా బామ్మా! ముందామాట చెప్పు.'

'అవునుతండ్రీ! ఆమె మీయమ్మ. ఖర్మవశాత్తూ, ఆమెగతి అలాపట్టింది.'

'మాఅమ్మను—నేనే చంపుకున్నానా!'

అంటూ చందు మేడదిగి కిందికొచ్చెయ్యబోగా ఇంతీదేవి అతనిని వారించి—

'నువ్వు కిందికిపోవద్దు తండ్రీ! నేనుపోయి ఆమెస్థితి యెలా వుందో తెలుసుకొస్తాను.'

అని ఇంతీదేవి తండ్రీకొడుకులకు మేడమీదనేవుంచి, తాను డాక్టర్లు రోగికి చికిత్సను చేస్తున్నదగ్గర కొచ్చేసింది.

'ఇంతకుముందనేకసార్లు ఆమెనన్ను పట్టుకోడానికీ, ముద్దుపెట్టుకోడానికీ ప్రయత్నంచేసింది నాన్నగారూ! ఆమె మాఅమ్మఅని ఒక్కరయినా చెప్పారుగారు.'

అని చందు కళ్ళంట నీళ్లుకారుస్తూ అన్నాడు.

'అలా చెప్పకపోవడానికి తగినంత కారణం లేకపోలేదు నాయనా! ఆమె తనపాపిష్టిజీవితంవల్ల కన్నకొడుక్కుకూడా దూరమై పిచ్చి దయింది.'

'నువ్వామెకు అనేకసార్లు రూపాయలు నోట్లు యిచ్చావు.'

'ఆమెదెటువంటి పాపిష్టిజీవితమయినా, నాతో కొంతకాలం కాపురంచేసినభార్య—నిన్నుకన్నతల్లి—'

'నన్ను కన్నతల్లి—'

అంటూ చందు కంటికీ మంటికీ ఏకధారగా ఏడవడం మొదలు పెట్టాడు.

ఆమెకీభూమిపై నిలవగల భాగ్యముందో—లేదో—ఎవరు చెప్ప గలరు?

---

౬

'రివాల్వరుగుండు ఆమెకు భుజంలో యిరుక్కుని వుందిట! ఆమె బ్రతకడం దుర్లభమని చెబుతున్నారు డాక్టర్లు—'

అని ఇంతి దేవి, తిరిగి మేడమీదికొచ్చి చెప్పడంతోనే.

'మాఅమ్మ ఏదని అడిగినప్పుడల్లా—'ఏనాడో చనిపోయింద'ని చెబుతుండేవారు. మీరందరూ నన్ను దగాచేశారు. అంత్యసమయం లోనయినా నేను మాఅమ్మ గుండెలమీద పడుకుని కడసారిఏడుస్తాను''

అంటూ చందు పట్టలేని దుఃఖంతో చావుబ్రతుకుల్లోవున్న తల్లిని కలుసుకోడానికి మేడకిందకు పరుగెత్తబోతుండగా, వకేశం కొడుకుచెయ్యి పట్టుకుని బలవంతాన కూచోబెట్టి—

'వల్లకాదు—నువ్వాకుచ్చితురాలి పాపిష్టిశరీరాన్ని ముట్టుకోడాని కయినా వల్లకాదు. ఆనీచురాలు తల్లిఅని చెప్పుకొంటే, నీజీవిత సర్వ స్వమూ నాశనమై పోతుంది—'

అని కళ్ళెర్రజేసి చెబుతున్న తండ్రిగారి మాటలేమీ అర్థం గాలేదు చందుకు.

'మాఅమ్మ కుచ్చితురాలా! నీచురాలా! నేనామె శరీరమునయి నా ముట్టుకోడానికి వల్లగాదా?'

అని చందు గుడ్లనీరు గ్రక్కుతూ తండ్రిగారి నడిగాడు.

'అవును—వల్లకాదు—నువ్వు మేడదిగావంటే మాటదక్కదు—'

అని నటేశం కఠినంగా శాసించి తానుమాత్రం మేడదిగి కిందికి వెళ్ళిపోయాడు.

'ఏమిటి బామ్మా యీఘోరం? ఆమెనన్ను కన్నమాతృదేవత అని చెబుతున్నారు—నేనామెను ముట్టుకోడానికయినా వల్లకాదంటారేం'

అని అనంతరం చందు ఇంతీదేవి నడగ్గా—

'నాన్నగారికింకా యెక్కువకోపమును తెప్పించకు తండ్రీ!'

అని ఆమె క్లుప్తంగాచెప్పిన జవాబుతో చందు తృప్తిపడలేదు.

'ఆమె మాఅమ్మ అయినమాట నిజమేనా?'

'అవునుతండ్రీ నిజమే!'

'నన్ను కన్నతల్లి.'

"అవును.'

'అయితే ఆమె యిదివరకే చనిపోయిందని నాతో యెందుకు చెప్పారు?'

ఇంతీదేవి జవాబు చెప్పలేదు.

'ఆమె కుచ్చితురాలా! నీచురాలా! చెప్పుబామ్మా, ఆవిషయ మంతా యేమిటో నాతోచెప్పు! నాతల్లిని నేను చేతులారా చంపు కొన్నాను.'

'గడచిపోయినదేమయినా, కెలుకివస్తుందా నాయనా!'

'కలసిరాకపోయినాసరే! అదేమిటో చెప్పు—నాన్నగారి కామె యందటువంటి బద్ధవైర మెందుకేర్పడినదీ? నువ్వు చెప్పకపోయినట్లయితే, నేనిప్పుడే కిందికిపోయి పదిమందిలోనూ నాన్నగారినే నిలదీసి అడుగుతాను."

అంటూ చందుకూర్చున్న చోటులోనుంచి లేవగా—

'ఒద్దుతండ్రీ! అంతపనిమాత్రం చేయొద్దు.'

'మరయితే ఆవృత్తాంతమంతా నాకుచెప్పు—'

'చెబుతాకూర్చో.'

అని ఇంతీదేవి మనమణ్ణి బలవంతాన కూచోబెట్టి యీవిధంగా చెప్పడం మొదలుపెట్టింది—

'మీయమ్మ, అనగా యిప్పుడు నీచేత రవాల్వరు దెబ్బతిని చావు బ్రతుకుల్లోవున్నాయువతి అద్భుతమయిన రూపసంపదగల యిల్లాలు. ఆమెపేరు అశ్విని. మీనాయన బి. ఏ. చదువుతుండగానే, ఆమె పదిహేనువేలరూపాయల కట్నంతో కాపురానికొచ్చింది. ఆపదిహేను కింకోపదిహేనువేలు కలిపి, మొత్తం యిప్పయివేల రూపాయలకిమ్మతు గల జహ్వేరి పెట్టాముమేము.

మీనాయన కామెతగినభార్య అనీ—ఆమెకు మీనాయన తగిన భర్త అనీ—లోకమంతటా పేరుమోసింది.

ఆమె ఈయింట్లో అతులిత సౌభాగ్యసంపదలతో తులతూగుతున్న రాణిఅని చెప్పడాని కేమాత్రమూ సందేహంలేదు. భార్యాభర్తలిద్దరూ ఎక్కువ అనుకూలంగా వుండేవారు.

అయిదేళ్ళామెతో కాపురంచేసిన అనంతరం, మీనాయన ఐ. సి. యస్. కు లండను వెళ్ళవలసివచ్చింది. అందువల్ల అశ్విని నా దగ్గరే వుండవలసినదయింది. నువ్వప్పటి కయిదేళ్ళ పిల్లాడివి.

నేనామెను కన్నకూతురుకంటే యెక్కువగా ప్రేమతో చూసే దాన్ని. ఆమెకూడా నాయందదేవిధంగా వుంటుండేది.

తను లండనునుంచి తిరిగివచ్చేటప్పటికి, అంతకుముందునుంచీ సాధకంచేస్తున్న వీణను పూర్తిగా నేర్చుకుని వుండవలసిందని, మీాతా యన ఒకగురువు నేర్పాటుచేశాడు లండను పోయేటప్పుడు.

నిర్ణీతకాలంలో నిత్యమూవచ్చి, అతడు అశ్వనికి పాఠంచెప్పి పోతుండేవాడు. రెండుమూసాలవరకూ నాకెటువంటి అవమానమున్నూ కలుగలేదు.

పాఠం అయిపోయిన తరువాతకూడా అతను అనవసరంగా అశ్వనితో బాతాఖానీ వేస్తున్నట్లు—నాకనుమానం కలిగింది. రోజూ రెండు మూడుసార్లు అనవసరంగావచ్చి కూర్చోవడం మొదలుపెట్టాడు, అశ్వని అతనితో నవ్వులు—పరాసికాలూ ప్రారంభించింది.

క్రమంగా వ్యవహారం ముదురుతున్నట్లుగా నాకు భయమేసింది, అందువల్ల ఒకనాడు అశ్వనితో—

"అమ్మాయీ! మేష్టరు, ముకుందు అల్లరిచిల్లరవాడిలా కను పిస్తున్నాడుగాని, మనలాంటి పరువుగల యిళ్ళల్లోకి రాదగిన పెద్దమని షిలా అవుపించడంలేదు. నీమొగుడుచూస్తే దూరానవున్నాడు, నువ్వు మాత్రం అతిజాగ్రత్తగా వుండకపోతే ప్రమాదంసుమా!'

అని ముక్తసరిగా చెప్పాను.

దానికే ఆమెకు నామీాద అపరిమితమయిన ఆగ్రహం కలిగింది.

"అంతచేటు అనుమాన మున్నప్పుడు, నాకసలు సంగీతం చెప్పిం చడమెందుకూ?'

అని తీక్షణంగాఅడిగింది, నేనన్నమాట కామెకంత కోపమొస్తుం దని నేననుకో లేదు.

"పాఠం లేనప్పుడుకూడా అనవసరంగా బాతాఖానీ పెట్టుకుని కూచుంటున్నాడు, కారణం లేకుండా నాలుగయిదుసార్లు వస్తున్నా, నువ్వాతనితో పకపకలు—వికవికలూ సాగిస్తున్నావు, చూసినవాళ్ళకి దేమయినా బాగుంటుందేమో ఆలోచించు—పెద్దదాన్ని, బాధ్యతగలదాన్నిగాబట్టి చెబుతున్నాను—'

అని నేనుకూడా కొంచం తీవ్రంగాచెప్పాను. అందుకామె ముఖమును ముడుచుకుని—

'ఎవరయితేమాత్రం? చెయ్యదల్చుకున్నవారిని పట్టుకోగలరా యేమిటికి?'

అని అడిగింది. ఆమెమాటలు నాకు చాలాఆశ్చర్యమును కలిగించాయి. ఇంతలోనే ఆమెహృదయం మారిపోయిందటే నేను నమ్మలేక పోయాను.

ఏమయినా అప్పటికింకేమీ అనలేదు. భర్తదగ్గరలేని సమయంలో అత్తగారు ఆగళ్ళుపెడుతుందని, లోకం ఎక్కడఅనుకునిపోతుందో అని నాకుభయం.

ముకుంద్ తనచర్యలను మామూలుగానే సాగిస్తున్నాడు. అశ్వనికూడా తనప్రవర్తనను మార్చుకోలేదు. ఒకరోజుకంటే ఒకరోజు ఆయిద్దరూచేసేపనులు నాకు చాలాఅసహ్యమును కలిగిస్తున్నాయి. పాఠంజరుగుతుండగా ఒకటిరెండుసార్లు గదితలుపులను వేసుకోవడము చూశాను. భరించలేకపోయాను.

తక్షణం సంగీతంమేష్టర్ను మానుకోవలసిందనిచెప్పేను.

అందునుగురించి అశ్వనీ, ఆమేష్టరూకలిసి నామీదికి పేచీకొచ్చారు.

'నాభర్తనిర్ణయించిన మేష్టర్ను మీరెందుకు మానిపిస్తారు?'

అని అశ్వని—

"మీ కేమధికారముంది?"

అని ఆమేష్టరు—

ఇద్దరూ ఏకమై నామీదికి తిరగబడ్డారు.

"ఏమయినాసరే—నువ్వు మాగుమ్మంలోకి రావలసిన అవసరంలేదు. మాఅబ్బాయికి నీయందంతగా ఇష్టముంటే, తిరిగివాడొచ్చాకనే పాఠం ప్రారంభించు—"

అని నేను ఖండితంగా చెప్పడంవల్ల వాడప్పటినుంచీ పాఠానికి రావడం మానుకున్నాడు. అతన్ని మానిపించేశానని . అశ్వని, వరసగా నాతో మాటలాడడం మానేసింది.

నీకప్పుడు నాలుగయిదేళ్లుంటాయి. మీఅమ్మ కాపరానికొచ్చిన మొదటిసంవత్సరంలోనే నువ్వుపుట్టావు. అంతవరకూ మంచిపేరు సంపాదించిన అశ్వని కప్పుడు బుద్ధిమారిపోయింది గాబోలు!

అని ఇంతీదేవి చెబుతున్నదాని నంతటినీ అతిశ్రద్ధగా వింటున్నాడుచందు.

## ౭

కోడలు నాతో మాటలాడకపోయినా సరేగానీ, సంగీతం మేష్టర్ను మానిపించడంవల్ల, నామనస్సుకు శాంతిగావుంది. కుటుంబానికి అపఖ్యాతిరాకుండా కాపాడానుగదా అని తృప్తిపడ్డాను.

ఆతుంటరిచచ్చినాడు రాత్రిలు రహస్యంగా లోపలప్రవేశిస్తున్నాడని నాకేం తెలుసు?

ఒకరాత్రి దొడ్లో ఏదోచప్పుడు కావడంవల్ల నాకు నిద్రాభంగమయింది. తక్షణం లాంతరుపట్టుకొని దొడ్లోకెళ్ళాను.

వెన్నెల పుచ్చపువ్వులావుంది. అశ్వని ముకుందును తనగదిలోనుంచి దొడ్లోకితీసుకొచ్చి, దొడ్డిగుమ్మాన అవతలకు సాగనంపుతుండడమును స్పష్టంగాచూశాను. నాశరీరం కంపించి పోయింది. నోటి మాటరాలేదు.

నేను చూసిన విషయమును గమనించీకూడా అశ్వని ముకుంద్‌ను దొడ్డిగుమ్మాన అవతలకు సాగనంపేసి, తనువచ్చి తనగదిలో పడుకుంది. నేనెలావూరుకోను? ఊరుకోక చెయ్యవలసిన కర్తవ్యమేమిటి?

'ఔరా! అశ్వని చూస్తుండగానే ఎంతటిదయింది? ఈవిషయం అబ్బాయికితెలుస్తే యింకేమయినావుందా? పెళ్ళాన్ని నరుకుతాడు—ముకుందును నరుకుతాడు. వ్యవహారమింతవరకూ వచ్చాక, వాడికి తెలుపుకు చేయకుండా ఎలావుండను?

దగ్గరగాడు—బాపుగాడు. లండనులో వున్నవాడికి ఉత్తరం మూలంగా యీవిషయము నంతటినీ తెలుపుదుచేస్తే, చదువును పాడుచేసుకుని పరుగెత్తుకొచ్చేస్తాడు.

అశ్వనిని జుట్టుపట్టుకుని అవతలకు గెంటేస్తాడో—రివాల్వరుతో కాల్చి చంపుతాడో, ఇంకా యేం ప్రమాదాలు జరుగుతాయో కుటుంబం అల్లరిపాలయిపోతుంది.

ఇంతటినుంచయినా అశ్వనిబుద్ధిగావుండి ముకుందుతోటి సంబంధమును వొదులుకొంటే బాగుపడుతుంది—లేకపోతే నేనేంచెయ్యాను?

తొందరపడి, అబ్బాయి కీవిషయమునంతటినీ ఉత్తరంద్వారా తెలుపుదుచేయడంకంటే, నాసర్వశక్తులూ వినియోగించి, అశ్వనిని సన్మార్గంలో పెట్టడం మంచిది.

అని నాలో నేనాలోచించుకుని, మెల్లిగా అశ్వనివున్న గదిలో కెళ్ళాను.

అంతవరకూ మెలుకువగావున్న ఆమె నన్నుచూడగానే కళ్ళు మూసుకుంది. అప్పుడామెముఖమును చూడడానికికూడా నాకరిమిత మయిన అసహ్యంకలిగింది.

అయినప్పటికీ వంశగౌరవమును కాపాడడంకోసం, నాఅహంకారమును, నా అసహ్యమును, నాలోనే అణుచుకోవలసి వచ్చింది.

'అశ్వనీ! ఏమిటీ యీదారుణం! నువ్వు పుట్టిన దెటువంటివంశం, మెట్టిన దెటువంటివంశం, నువ్వుచేసే నీచకార్యాలేమిటి?'

అని నేనడిగినదానికేమీ మాటలాడలేదు.

'ఆసంగీతం మేష్టర్ను నేనుచూశాను. నీవ్యవహారమంతా రేపీ నీమొగుడికి ఉత్తరంరాస్తే నీబ్రతుకేమవుతుందో కొంచమాలోచించావా?'

అని నేను తిరిగి హెచ్చరించినప్పటికీ ఆమె జవాబు చెప్పలేదు.

అయిపోయిందేదో అయిపోయింది, నీరహస్యమును నేను కడుపులో పెట్టుకొంటాను. ఇంతటినుంచయినా నీదుస్స్వప్నాలు మానెయ్యి! నువ్వు బ్రతికే బ్రతుకేమిటి? నీమొగుడు నేడో రేపో పరీక్షప్యాసయివచ్చి కలెక్టరీ చెయ్యబోతున్నాడుగదా, నువ్విటువంటి పాడుబుద్ధులు కలిగి వుంటే యింకేమయినావుందా? నటేశం అసలే కోపిష్టివాడు—నిన్ను కత్తితో పొడిచి చంపడూ?'

అని చెప్పినమాటలన్నీ వినడమేగాని, అశ్వని జవాబు చెప్పడం లేదు.

'ఆసంగీతంమేష్టరేదోవిధంగా మభ్యపెట్టి నిన్ను వలలోవేసుకున్నాడు. పండువంటి కాపరమును పాడుజేసుకుంటావు. నామాటవిని, యింతటినుంచయినా బుద్ధిగావుండు. లేకపోయినట్లయితే చాలా చాలా చిక్కులు పడతావు'

అని నేనామెకు నయాన్నీ భయాన్నీకూడా అనేకవిధాలుగా చెప్పాను. ఆమె తిరుగుచెప్పక పోవడంవల్ల, మార్గమును దిద్దుకుని, బుద్ధిగా వుంటుందని అభిప్రాయపడ్డాను.

ప్రతిరాత్రి కంటికి నిద్దరలేకుండా, మేలుకొన్నుని, ఆసంగీతం మేష్టరు ఎక్కడవొస్తాడోఅని కనిపెట్టి చూస్తున్నాను. వరసగా నాలుగు రోజులుమాత్రం రాలేదు.

అయిదోనాడు, అంతకుముందే ఏర్పాటు చేసుకొన్నారుగాబోలు వాడొచ్చి దొడ్డితలుపును మెల్లిగాతట్టాడు. అశ్విని గబగబవెళ్ళి తలుపు తీసింది. అతనిని లోపలప్రవేశపెట్టి, తనగదిలోకి తీసుకుపోయింది.

నేనంతా కనిపెడుతూనేవున్నాను. కాని ఏమిటీచెయ్యడం. అంత తెలివయినదాన్ని ఆసమయంలో ఎందుకూ పనికిగాని దానినయ్యాను. ఇరుగుపొరుగువార్ని నలుగుర్నిపిలిచి, పెద్దగోలచేసి, ఆసంగీతంమేష్టర్ను నాలుగు చెప్పుదెబ్బలు, అశ్వినిని నాలుగుచెప్పుదెబ్బలూ కొట్టిద్దామా అన్నంతటి ఉద్రేకం కలిగింది.

కాని ఆవిషయం నలుగురికూ తెలుస్తే ఎంతఅపఖ్యాతి—ఎంత అగౌరవం? ఆరెండు చెడిపోయినాక యింకెందుకూ? నవలలేక మింగ లేక, ముందునే నేఆత్మాహత్యఅయినా చేసుకుని చచ్చిపోదామా అను కున్నాను. కాని సాహసం లేకపోయింది.

రెండు మూడుగంటలుదాటాక, ముకుంద్ వచ్చిన మార్గానే వెళ్లిపోయాడు.

'నీకేదో చేటుకాలమొచ్చింటికనకనే యిటువంటి పాడుబుద్ధులు పుడుతున్నాయి—నీదుర్వృత్తిని నువ్వుమానవా యేమిటమ్మాయీ?'

అని నేను అశ్వినిని నిలదీసి అడిగాను. ఆమెజవాబు చెప్పకుండా ముఖమును చిట్లించుకుని, తనగదిలోకిపోయి పడుకుంది. ఆమె మోట తనంఏమిటో నాకర్థం గాలేదు.

మర్నాడు అబ్బాయికి ఉత్తరంరాసేదామనే ఆలోచించాను. కాగితమును కలమును తెచ్చాను. ఉత్తరమును సొంతంగా రాశాను.

'ఈవుత్తరం గందుకున్నాడంటే వాడిమనస్సువికలమైపోతుంది— చదువు పాడుజేసుకొని, నిమిషాలమీద పరుగెత్తుకొస్తాడు. పెళ్లాన్ని

శిక్షిస్తాడు. నలుగురిలోనూ ఎలాగాఅల్లరయిపోవడము—వాడిచదువు చెడిపోవడము—'

అని నేను తిరిగిమారంగా ఆలోచించి రాసినవుత్తరమునే చించి పారేశాను.

అనంతరం అశ్వనిని అనేకవిధాల బ్రతిమాలాను. భయపెట్టాను—లాలించాను — బుజ్జగించాను — కాని ఆమె తనదున్నదశను సరిచేసుకో లేదు. పోనీ, అబ్బాయివచ్చేవరకూ ఆమెను కన్నవాళ్ళింటికి పంపె దామాఅంటే, అంతబాధ్యతగల కన్నవారెవరూ లేరామెకు.

మయంగా నాకొచ్చిపడిందిచక్కచావు. ముందుకొస్తేనుయ్యి — వెనక్కిడితేగొయ్యిలా అయింది వ్యవహారం. అబ్బాయివచ్చేవరకూ నిమిషమొకయుగంలాగ గడుపుతూ వెయ్యిదేవుళ్ళకు మొక్కుతూ వున్నాను.

చెప్పవలసినపద్ధతులన్నీ అయినాయి, చెయ్యవలసిన ప్రయత్నా లన్నీ అయినాయి. ముకుంద్ రాత్రులువస్తూనేవున్నాడు.



# ౮

నిర్ణీతకాలంలో అబ్బాయి చదువు పూర్తిచేసుకుని, పరీక్షపాస్యయినవచ్చేశాడు లండనునుంచి. నాతలమీద ఏదో పెద్దబరువుదించినట్లయింది.

అశ్వనివిషయం నేను వాడికేమీ చెప్పలేదు—చెబితే యింకేముందీ? మరుక్షణంలోనే భయంకర ప్రళయం.

భర్త రానేవచ్చాడు. అంతటితో అశ్వని బుద్ధికలిగి వుంటుందనే విశ్వాసంతో గతించినదంతా నాలోనేనే జీర్ణించుకుని మెదలకుండా వూరుకున్నాను. సంగీతంమేష్టరు మానుకోవడమునుగురించి అశ్వని మొగుడుతో ఏమనిచెప్పిందో ఏమో—అతనుమాత్రం నన్నేమీ అడగలేదు—బ్రతికిపోయాను.

పరీక్షపాసయి, వచ్చీరావడంతోనే అబ్బాయిని గుంటూరు జిల్లాకలక్టరుగా నియమించారు. సంగీతంమేష్టరుపీడ అంతటితో పూర్తిగా వొదిలిపోయిందిగదా అని సంతోషించాను. అబ్బాయి, అందర్నీ తీసుకెళ్ళి గుంటూరులో మకాంపెట్టాడు. కలక్టరీహోదా దేదీప్యమానంగా వెలిగిపోతూంది.

ముకుంద్ కూడా ఆవూరే కాపరమొచ్చాడుగాబోలు, నాకేం తెలుసు? ఒకనాటి మధ్యాహ్నం, అబ్బాయి కచ్చేరీలో వుండగా, అతుంటరి యింటికొచ్చి అశ్వనితో ఏమేవో గుసగుసలాడుతున్నాడు. నాకు అరికాలిమంట నెత్తికెక్కింది.

శ్రీశనిగ్రహంలా నువ్వు మళ్ళీ యిక్కడ దాపురించావన్నట్రా, అబ్బాయికి తెలిసిందంటే, శిరచ్ఛేదం చేయిస్తాడు. నాలుగుకాలాలు భూమిమీద మన్నాలీఅంటే—మళ్ళీ మాగుమ్మం తొక్కొద్దు—పో!"

అని నేను తీవ్రంగా ముఖంతగ కేస్తుంటే, ఆసిగ్గులేనివాడు ముసి ముసినవ్వులు నవ్వుకుంటూ అవతల కెళ్ళిపోయాడు.

'ఏంపిల్లా! నీకు కాపరంనిలువుకుని బ్రతకాలని లేదానేంటి? ఎందుకెందుకని నేను కడుపులోపెట్టుకొని వూరుకోవడంవల్ల, నివ్వింత కాలమూ బ్రతికిపోయావు. నువ్విక్కడకూడా వాడితో మామూలు వ్యవహారమును సాగించదలుచుకున్నట్లు తెలుస్తూంది. లాభంలేదు. ఇక నేను సహించను. నీమొగుడితో చెప్పేస్తాను. ఆనక నీబ్రతుకేమవు తుందో కొంచమాలోచించుకో—'

అని ముకుందు వెళ్ళిపోయిన తరువాత అశ్వానికూడా నేను నానావిధాల్లూ వేశాను. ఆమె జవాబుచెప్పలేదు. మామూలుమొండి తనమునే వహించి వూరుకుంది.

అబ్బాయితో చెప్పేస్తానని అన్నానేగాని, సంసారానికి నాచేతు లారా నేను విచ్ఛిత్తిని కలిగించడ మెందుకు? ఎప్పుడో పాపం బ్రద్దలు గాకతప్పదు. అశ్వని బుద్ధిగావుండదు—ఆమె కేదో చేటుకాలం కనిపెట్టు కునేవుంది నాకు తెలుసు.

ఆమెను సన్మార్గంలో పెట్టడానికి నాసర్వశక్తులూ వినియోగించి ప్రయత్నంచేశాను. కాని లాభంలేకపోయింది. నేను చెయ్యగలిగిందిం కేముంది. ఆపాడువిషయమును నానోటితో నేనబ్బాయికి చెప్పడమున కిష్టపడలేదు.

అని అంతవరకూ యింతీదేవిచెప్పినదాని నాలకించిన చందు—

'అయితేబామ్మా! పెద్దదానవు—కుటుంబంలో ఎక్కువబాధ్యత గలదానవు—నాన్నగారికి నువ్వీవిషయమును వెంటనేచెప్పకపోవడం బాగుందా?'

అని అడిగాడు.

'నాయనా! అబ్బాయికి కోపం వస్తే ప్రాణాలుండేవీ పోయేవీ కూడా చూసుకోడు. అందులోనూ నామాటయందు వాడికెక్కువవిశ్వాసం.'

నేనెప్పుడయితే అశ్వనియొక్క దుర్నడతనుగురించి చెప్పానో, వాడాక్షణం వెనుకముందు లాలోచించకుండా పెళ్ళాన్నినరుకుతాడు. అటువంటిఘోరపరిస్థితిని నాచేతులారా నేను తెచ్చిపెట్టడమెందుకని ఒకటి, రెండవది—అబ్బాయయితే నామాటనమ్ముతాడు. నేనావిషయమును కల్పించి చెప్పలేనని విశ్వసిస్తాడు—కాని మంచిచెడ్డలు తెలియని లోకం, అత్తగారుగిట్టక కోడలిపై లేనినేరాలుకల్పించి కొడుకుతో చెప్పి యింతచేసిందని పన్నాడిపోసుకుంటుంది.

కుటుంబానికి అల్లరితప్ప, యింక మిగిలేదేముంది?

నేను రెండేకార్యాలు మనసులో పెట్టుకున్నాను. అశ్వని, తన దుర్నడత భర్తకు తెలిసి ప్రళయందరుగకమునుపే సరిచేసుకోవడము— లేదా, ఎప్పుడో ఒకప్పుడామెపాపం బ్రద్దలయి, ఆమెచేతులారా చేసుకొన్నదానికి తగినఫలితము ననుభవించడము. ఈరెంటికీమించిన మూడవమార్గం నాకేమీ ఆలోచగించలేదు.

అని ఇంతిదేవి చెప్పింది.

'నాన్నగారింత సేపటినుంచీ కిందనే వుండిపోయారు. మేడమీదికి రాలేదు. మనంకూడా అక్కడికిపోదామా బామ్మా!'

'వద్దు—మనమక్కడికెడితే నాన్నగారాగ్రహంచేస్తారు. మీ అమ్మయొక్క పూర్వావృత్తాంతమును వినేసెయ్యమరి—'

'ఊఁ! చెప్పుబామ్మా! తరువాత ఏముయింది?'

'అశ్వనికంటే ఎక్కువ దురవస్థకలగిన వారనేకమంది—దానిని కర్మఅని సరిపెట్టుకొంటే సరిపెట్టుకోవచ్చు కాని చేతులారా చేసుకొన్న దానిని కర్మ అనుకోవడమెందుకు?

నేనామె కెన్నివిధాల బోధచేశాను? ఎన్నివిధాల బ్రతిమాలాను విన్నదా?

విన్నట్లయితే జీవితానికటువంటి విచ్ఛిత్తి యెందుకుకలుగుతుంది

పాపం బ్రద్దలయ్యేవరకూ ఆమె తనబుద్ధిని మానిందిగాదు. నా కంటబడితే చీవాట్లు పెడతాననీ తనప్రియుణ్ణి తూలనాడతాననీ—నా క్కూడా తెలియకుండా, నాకళ్ళల్లోకూడా కారంజల్లి, భర్త కచ్చేరీకివెళ్ళిన సమయంలో సంగీతంమేష్టరున్న ఏమూలనుంచో నేను చూడకుండా తనగదిలో ప్రవేశపెట్టుకొనేది.

ఈప్రకారంగా గుంటూరులో రెండుసంవత్సరాలు సాగించింది.

నరేశానికంటే యీవిషయం తెలియలేదుగాని, ఊళ్లోవాళ్లకూ వీధిలోనివాళ్ళకూ కొంతమందికి తెలిసింది. అలా తెలిసినవాళ్లు నన్ను రహస్యంగా పిలిచి—

'నీకొడుకు బ్రతికే ఆఘనమయిన బ్రతుకేమిటి? యింట్లో నీకోడలుచేసే దారుణమేమిటి? పెద్దదానవు—యింట్లోవుండి, ఎలాసహించుకొంటున్నావు? పదిమందిలోనూ తలయెత్తుకుని తిరిగే కలక్టరు—నీకొడుకు గౌరవప్రఖ్యాతుల్ని కాపాడవలసిన బాధ్యత నీకు లేదుటమ్మా!'

అని నన్నుచివాట్లు వేసేవారు. అప్పుడునాకు బుర్రకొట్టేసినట్లయ్యేది, కాని ఏంచెయ్యను? కర్తవ్యం గోచరించడం లేదు—

అశ్వని నాచెప్పుచేతల్లోవుండే మనిషిగాదు—ఆమె నాప్రయత్నానికి దాటిపోయింది. ప్రజలకేసంగతి ఏంతెలుసు? ఆదారుణమునంతటినీ నాకడుపులోనే యిముడ్చుకొని, ఎలా బ్రతుకుతున్నానో యితరులకేం తెలుసు—

చివరకు పాపం బ్రద్దలయ్యేరోజు రానేవచ్చింది.

## ౬

అంతకుముందొక నెలరోజులనుంచి సంగీతంమేష్టరు వచ్చినట్లు గాని, వెళ్ళినట్లుగాని, నాకేమీ కనుపించలేదు.

అశ్విని తనదుర్బుద్ధిని తనంతటతానే మానుకొందిగాబోలునని నాలోనేనపరిమితమయిన ఆనందము ననుభవించాను.

ఒకనాటిమధ్యాహ్నం నేనువిశ్రాంతికోసం నిన్నుపక్కలోపెట్టుకొని పడుకొని నిద్దరపోతున్నాను. అబ్బాయిసాధారణంగా సాయంకాలం ఆరుగంట లయితేగాని, యింటికిరాడు. అటువంటిదానాడు మూడుగంటలకే వచ్చేశాడు.

'అమ్మా!' అని తలుపుతట్టి పిలిచేటప్పటికి నేను త్రుళ్ళిపడిలేచి తలుపుతీశాను. వాకిట్లో కారుంది. అబ్బాయి లోపలకొచ్చేశాడు.

'ఈపూట ఎందుచేతనో తలనొప్పిచాలాయెక్కువగావుందమ్మా! అందువల్ల కచ్చేరీకట్టేసివచ్చా—అశ్వనియెక్కడ?'

అంటూనే ఆమెగదిలోకి వెళ్ళాడు.

'అయ్యో!అంతయెక్కువగా యెందుకొచ్చింది తండ్రీతలనొప్పి—'

అంటూ నేనూ అబ్బాయివెనకాలనే అశ్వనిగదిలోకెళ్ళాను.

ప్రాణాలులేని శవంలాగ, సంగీతంమేష్ట రక్కడి పందిరిమంచం మీద పడుకునివున్నాడు. అశ్విని ఖంగారుపడుతూంది. నటేశం కళ్ళంట నిప్పులు రాలుస్తున్నాడు పంట్లాంజేబులోనుంచి రివాల్వరు తీశాడు.

ఆమె పాపం బ్రద్దలయ్యేరోజు అదేఅని నేను నిశ్చయించేసుకున్నప్పుడు నాకళ్లు చీకట్లుకమ్మాయి. నోటంట మాటరాలేదు.

అశ్వని భర్త పాదాలమీదపడి వేడుకుంటుందేమోననుకున్నాను—కాని అటువంటిదేమీ జరగలేదు.

'నీచురాలా! ఈదారుణవ్యవహారాన్ని ఎంతకాలంనుంచి సాగిస్తున్నావ్?'

అని దిక్కులు పిక్కటిల్లేటట్లు ఒక్క కేక వేశాడు.

'ఏమమ్మా! నువ్వయినా చెప్పావుగా వేం?'

అని నాయిపు చురచురచూస్తూ అడిగాడు.

'వీడిప్పుడిలా యీగదిలోవున్నట్లు నాకూ తెలియను తండ్రీ!'

అని నేను కంపించే గొంతుకతో చెప్పాను.

"ఛీ! నీలాంటి కుచ్చితురాల్ని చంపినా ఒకటే—కుక్కను చంపినా ఒకటే—'

అంటూ నటేశం, తీసిన రివాల్వరును తిరిగి పంట్లాందేబులో పెట్టుకొన్నాడు.

"నీతో ఒక్కమాటయినా మాటాడవలసిన అవసరంలేదు—ఒంటిమీదివస్తువులన్నీ ఒలిచి అక్కడ పెట్టు.'

అని నటేశం అనడమేతడవుగా రవ్వలతోను, మాణిక్యాలతోనూ నిండిన సుమారు ముప్ఫయివేల రూపాయల జవ్వారీనీ ఒణుకుతున్న చేతులతో ఒలచిపెట్టింది. అశ్వని.

'ఆవిలువగల చీరకూడావిప్పి, మరోపాతచీర కట్టుకో—'

అశ్వని అదేవిధంగా అప్పుడు కట్టుకున్న పెద్దబనారసుచీరను విప్పి, మరొక చింకిరిచీర కట్టుకుంది. కిక్కురుమనలేదు.

"ఊం! తక్షణం అవతలకునడు—జన్మలోయెన్నడూ యిహనా కంటికక్కుపించవద్దు—'

అని నటేశం అంటుండగా, అంతవరకూ నిర్జీవమై పడివున్న సంగీతంమేష్టరు మెల్లిగాలేచి, వంచిన తల నెత్తకుండా, మెల్లిగా అవతలకుపోయాడు. నటేశం వాడిముఖమయినా చూడలేదు.

అశ్వని భర్తకు ఏమో చెప్పాలనుకుంది.

'ఏమీ చెప్పొద్దు—కళ్ళారా చూడడంవల్ల ఎంతకాలంనుంచో పేరిగివున్నపాపం ఈనాడు బద్దలయింది— ఇహనువ్వేమైపోయినా నాకవసరంలేదు—ప్రాణాలతో వొదిలిపెట్టినందుకు సంతోషిస్తూపో—'

అంటూ, నటేశం ఆమె ససహ్యించుకుంటూ, ముఖాన ఉమ్మి వేశాడు.

'ఇదంతా నాకర్మ—'

అని అశ్వని మెల్లిగా అవతలకు వెళ్ళిపోతుండగా—

'చేతులారా చేసిన మహాపాపాలన్నింటికీ కలిగిన ఫలితాలను కర్మఅని సమర్ధించుకోవడం, నీలాంటి కుచ్ఛితులకు-కులటకు చెల్లింది'

అని ఆమె బయటికి వెళ్ళిపోయినవెంటనే తలుపులుమూశాడు."

"ఏమేఅమ్మా! ఇది యీదారుణకార్యాన్ని ఎంతకాలాన్నుంచి సాగిస్తూంది? ఈసంగీతం మేష్టరుగాడీవూ రెప్పుడొచ్చాడూ?

అని నటేశం నన్ను తీవ్రంగా ప్రశ్నలు వేయగా—

'నీకెంతయినా పుణ్యముంటుంది. నన్నాప్రశ్నలేమీ వేయొద్దు—నేనేమీ చెప్పలేను—'

అంటూ నేను చేతులతో ముఖమును కప్పుకుని ఏడవడం మొదలుపెట్టాను. ఏడనిమిదేళ్ళు చేసినకాపరాన్ని కాళ్ళతో తన్నుకు పోయింది. అభాగ్యురాలు—నేనెంత ప్రయత్నాలుచేసినా దుఃఖమాగిందికాదు.

'నువ్వు దుఃఖపడడం చాలాఅనవసరంఅమ్మా! ఇంతటితోఅయినా అనీచుకాలు ఒదిలిపోయినందుకు సంతోషించు—'

అని నటేశం నన్ననేకవిధాల ఓదార్చాడు. అప్పటినుంచీ అశ్వని విషయం మాకేమీ తెలియదు తెలుసుకోడానికి ప్రయత్నమును చెయ్య

లేదు. కాని లోకులందరూ విడ్డూరంగా చెప్పుకోవడంవల్ల, నటేశానికి తలవొంపులయింది.

అందువల్ల, అక్కడనుంచి అర్కాటు బదిలీచేయించుకున్నాడు. అక్కని ఏవేవో జబ్బులుపడి కొంతకాలం హాస్పటలులోవుండి, తిరిగి మేమున్నదగ్గర కొచ్చింది. అప్పటినుంచీ ఉన్మాదిలాగ వీధులంట తిర గడం మొదలుపెట్టింది మధ్యమధ్య మీనాన్నను కలుసుకుని, ఏదు యినా యిమ్మని అడగడము, అతను ప్రేమపాశాన్ని చంపుకోలేకనో, దయవల్లనో ఆమెకేమయినా యిస్తుండడము—జరుగుతూంది. అబ్బా యికి ఏవూరు బదిలీఅయితే అదికూడా ఆవూరొస్తూంది. ఇదీ మీనాయ మ్మ జీవితగాధ.'

అని ఇంతీదేవి చెప్పడమును పూర్తిచేసేటంతలో నటేశం వారున్న మేడమీదికొచ్చి—

'అయిపోయింది — ఆపాడుజీవితాని కింతటితో పరిసమాప్తి అయింది! దానికి కొడుకుచేతుల్లో వుండిగాబోలుచావు—'

అని నటేశమనగా—

'అక్కని చనిపోయిందీ?'

అని ఇంతీదేవి ఆశ్చర్యంగా అడిగింది. చంద్రుకు నోటంట మాటరాలేదు.

'ఆc! చనిపోయింది! చందూ! కావాలంటే నువ్విప్పుడుపోయి, మీఅమ్మమృతకళేబరాన్ని చూడొచ్చు.'

అని నటేశమనగా—

'అవసరంలేదునాన్నగారూ! ఆకులటయొక్క మృతకళేబరము నయినా, మనం కన్నెత్తిచూడకూడదు — నాకిప్పుడు చూడాలన్న కోరికకూడా లేదు—'

అన్నాడుచందు.

'భేష్! ఇప్పుడుగదా, నువ్వునాకు పుత్రుడ.నిపించుకోడానికి తగివున్నావు?'

అంటూ నటేశం కొడుకును కౌగలించాడు.

'ఆమెకులటేకానియ్యండి — కుచ్చితురాలే కానియ్యండి. కొడుకుకు కన్నతల్లి! చందు ఆమెను స్వర్గానికీ—ఉత్తమగతులకూ కర్మచేయవలసివుంది—'

అని తల్లి చెప్పగా—

పిచ్చి—తలిదండ్రుల పాతకాలను కొడుకులుకర్మచేసి మాపు చెయ్యగలరా! అయినా, నీమాటకాదనను—'

అని నటేశం చందుచేత అశ్వానికి కర్మచేయించడానికి పూనుకున్నాడు'

సమాప్తి.

---

శ్రీరామప్రెస్, రాజమండ్రి.

# మరణము - భువర్లోకము

జీవుడు కళేబరమును విడిచినతరువాత యేమగును? జీవునకు చావున్నదా? లేదా? పాపం, పుణ్యం అంటే యేమిటి? భూలోకవాసులు స్వర్గలోకవాసులతో మాట్లాడుట ఎట్లు? మొదలగు చిత్రవిచిత్రమైనసంగతులు తెలుసుకొనవలెనంటే నేడే ఈగ్రంథము చదవండి. గ్లేజుపేపరు వెల 0_10_0.

---

# మరణానంతర సందేశములు

ఇందు గతించి స్వర్గలోకవాసముచేయుచున్నవారితో మాటలాడువిధానము పొందుపరుపబడినది. ఈపుస్తకముచదివి అందువ్రాయబడినప్రకారము మీరు సాధకముచేసినచో చనిపోయినవారితో మాట్లాడగలరు. గ్లేజుపేపరు వెల 0_12_0

ఈరెండుగ్రంథములున్నూ, శ్రీ రావుబహద్దర్ మంత్రిప్రగడ నరసింహాంవంతులు బి. ఏ, బి. యల్.; రిటైర్డు కలక్టరుగారిచే వ్రాయబడినవి. వీరు యూరపుదేశమంతటను సంచారముచేసి తమస్వానుభవముచే నీరెండుగ్రంథములను వ్రాసిరి. కొలదిప్రతులుమాత్రమే గలవు. త్వరపడుడు. పోస్టుఖర్చులు కొనువారే భరించవలెను.

కావలసినవారు:—

కొండేపూడి కృష్ణమూర్తిగారు,
పుల్లితోటవీధి, రాజమండ్రి.

అని వ్రాయుడు.

శ్రీ కొవ్వలి

## రాబోవు నవలలు

నీలివార్త

నాటకరాకాసి

శ్రీరంగనీతులు

కళ్లల్లోకారం

యమునితీర్పు

కాశీయాత్ర

కామాంధుడు

లాటరీటక్కరి 1 భా॥

డిటో 2 భా॥

ఆడపెత్తనం

వలయువారు:—

పసుపులేటి బాపిరాజు,

శ్రీసత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి.